

# రాజైన బానిసపిల్ల

ఖురాసాన్ దేశంలో ఒక కోటీశ్వరుడైన వర్తకుడికి అలీషార్ అనే నవమన్మథుడు లాటి కొడుకు ఉండేవాడు. ఆ వర్తకుడు జబ్బుపడి, తన కాలం సమీపించిందని తెలుసుకున్నవాడై, అలీషార్‌ను పిలిచి, "నాయనా, నేను కన్నుమూసే ముందు నీకు కొన్ని హితవాక్యాలు చెప్పాలను కున్నాను. ప్రపంచం భయంకరమైన కొలిమిలాటిది; దానితో అతిగా సంపర్కం పెట్టుకోకు; అందువల్ల చాలా బాధలు పడతావు. నీకు శక్తి ఉన్నప్పుడు పరులకు ఉపకారం చెయ్యి కాని దానికి ప్రతిఫలం అపేక్షించకు. మరొకమాట కూడా జ్ఞాపకం ఉంచుకో: ఇతరులకు నిజంగా మేలుచేసే అవకాశాలు ఎప్పుడో తప్పరావు. నీ కున్న ధనాన్ని దుర్వ్యయం చెయ్యకు; నిన్ను లోకం నీ డబ్బుతోనే తూస్తుంది. ఇంకొక్క సంగతి: తాగుడు చాలా హేయమైనది; అది మనిషియొక్క పరువు మట్టిపాలుచేసి, మనిషిని నవ్వులపాలు చేస్తుంది," అని చెప్పాడు.

అలీషార్ ఎంతో భక్తితో, తాను చెప్పిన హితవాక్యాలను పాటిస్తానని మాట ఇచ్చి ప్రమాణం చేసినాక, ఆ ముసలివాడు నిశ్చింతగా కన్ను మూశాడు.

తండ్రి పోయాక అలీషార్ ఒక సంవత్సరం పాటు తూచా తప్పకుండా తండ్రి హితవచనాలు పాటిస్తూ వర్తకం సాగించి ఆ తరవాత క్రమంగా దుష్టసహవాసాలకు గురి కాసాగాడు. నీచులూ, పనికిమాలిన వాళ్ళూ, లేకివాళ్ళూ అయిన కుర్రవాళ్ళు అతని స్నేహం సంపాదించి, అతన్ని దుష్టమార్గాన నడిపించారు. ఆ మార్గాన కాలు పెట్టిన అలీషార్, తన వ్యాపారమూ, ఇళ్ళూ, వాకిళ్ళూ, తన సర్వస్వమూ గుల్ల అయిపోయిన దాకా కన్ను తెరవలేదు. తీరా అతను ఆ మైకంలో నుంచి బయటపడేసరికి

సి. మాధవరావు



అతనికి తన ఒంటిమీది ఉడుపులు తప్పించి చిల్లిగవ్వ కూడా మిగలలేదు.

కలిగిననాటి స్నేహితులంతా ముఖం తప్పించినాక అతనికి తన తండ్రి చెప్పిన హితవాక్యాలలోని వాస్తవం మరింత బాగా తెలిసి వచ్చింది. ఉండటానికి ఇల్లు కూడా లేదు. అలీషార్ ఒక పేదకొంపలో ఉంటూ తిండి కోసం ఆ గడపవద్దా ఆ గడపవద్దా అడుక్కోవలసిన స్థితికి దిగజారిపోయాడు.

ఇలా చిప్ప పుచ్చుకుని అడుక్కుంటూ అతను సంత పక్కగా వెళుతూ ఉండగా అక్కడి పెద్ద గుంపు కనబడింది. అక్కడి వింత ఏమిటో చూదామని అతను దగ్గిరికి వెళ్ళాడు. ఆ గుంపు మధ్య ఒక అందాల రాశి అయిన బానిసపిల్లను వేలం వేస్తున్నారు. ఆ పిల్ల అందాన్ని చూసి అలీషార్ నిశ్చేష్టుడై, తన దుస్థితిని మరచి, తనను తానే మరిచి, ప్రతిమలాగా నిలబడిపోయాడు.

బానిసను వేలం వేస్తున్నవాడు గొంతెత్తి, "అయ్యలారా! వ్యాపారులలారా! ధనికులారా! ఎడారి వర్తకులారా! దయ చెయ్యండి. ఈ కన్యను చూడండి, జముర్రుద్! చంద్రుణ్ణి ధిక్కరించే సౌందర్యవతి! ఈమె కేమిస్తారు? ఒక మాట అనండి! తప్పులేదు," అని ఆహ్వానించాడు.

ఎవరో అయిదువందల దీనారాలన్నారు. రషీద్ అల్దీన్ అనే ముసలి పీనుగొకడు ఆరువందలన్నాడు. ఇతరులు పాట పెంచారు. ముసలి పీనుగు వెయ్యి దీనారాలన్నాడు. ఆ తరవాత ఎవరూ ఉలకలేదు. అప్పుడు వేలం పాటగాడు బానిస సొంతదారుకేసి తిరిగి, "వెయ్యికి పాట కొట్టెయ్యమన్నారా?" అని అడిగాడు.

దానికి బానిస సొంతదారు, "నా కేమీ అభ్యంతరం లేదుగాని, ఎవరెంత పాడినా ఆమెకు ఇష్టం లేని వాడికి అమ్మనని ప్రమాణం చేశాను. అందుచేత నీవు పొందవలసింది ఆమె అనుమతి," అన్నాడు.

అప్పుడు పాటగాడు బానిస పిల్ల కేసి తిరిగి, "అందాల రాణీ, ఈ యోగ్యుడైన ముసలి రషీద్ అల్దీన్‌కు అమ్ముడు పోతావా?" అని అడిగాడు. జముర్రుద్ ఒప్పుకోనన్నది.

అదే ధరకు ఆమెను మరెవరైనా కొన టానికి సిద్ధంగా ఉన్నారా అని పాటగాడు అడిగితే ఇద్దరు ముగ్గురు సిద్ధపడ్డారు. ఒకడు రషీ దంత ముసలివాడు కాడు కాని తన ముసలితనం తెలియరాకుండా జుట్టుకు ఎర్ర రంగు వేశాడు. మరొకడికి ఒక కన్ను లేదు. ఇంకొకడికి పొడవాటి గడ్డం బొడ్డు దాకా వేళాడుతున్నది.

జముర్రుద్ అందరినీ వేళాకోళం చేసి ఎవరికీ అమ్ముడు పోనన్నది.

"సరే అయితే ఇక్కడ ఉండే వారి నందరినీ చూసి, ఎవరికి అమ్ముడవుతావో నీవే ఎంచుకో!" అన్నాడు పాటగాడు.

ఆమె ఒక్కొక్క ముఖమే పరీక్షిస్తూ అలీషార్‌ను చూడగానే అతని అందానికి ఆ క్షణంలోనే బానిస అయిపోయింది. ఆమె అతన్ని పాటగాడికి వేలు పెట్టి చూపించి, "అతనికి అమ్ముడవుతాను," అంటూ మగవాడి అందం మీద ఎవరెవరో రాసిన పద్యాలు బోలెడు చదివింది. పాట గాడు నిర్ఘాంతపోయి ఆమె యజమానితో,





"ఈ పిల్ల, ఏమో అనుకున్నాను, అఖండు రాలేనే!" అన్నాడు.

"ఇంతకే ఆశ్చర్యంగా ఉందా? దానికి రాని విద్య లేదు. అల్లిక పని అద్భుతంగా చేస్తుంది. యాభయ్యేసి దీనారాల ఖరీదు చేసే పరదాలూ, తివాసీలూ వారం రోజు లలో అల్లుతుంది. ఆమె కిచ్చే ఖరీదు త్వరలోనే రాబట్టుకోవచ్చు," అన్నాడు జముర్రుద్‌ను అమ్ముతున్న యజమాని.

పాటగాడు చెయ్యెత్తి, "ఆహా, ఇలాటి బానిసను కొన్నవాడి అదృష్టమే అదృష్టం!" అంటూ అలీషార్‌ను సమీపించి, "ఈ రత్నం తమకు నూరోవంతు విలవకు దొరుకు తున్నది," అన్నాడు. అలీషార్ విధి తనను ఈ విధంగా పరిహసిస్తున్నందుకు తనలో తాను నవ్వుకుంటూ, "పూటకు టికాణా లేని వాడికి ఈ వర్తకుల మధ్య ఎలాటి తలవంపు!" అనుకున్నాడు.

జముర్రుద్ అతని కేసి ప్రోత్సాహకరంగా చూసింది గాని అతను తల వంచుకుని ఉండటం చేత ఆ చూపు అందుకోలేదు. అప్పుడామె పాటగాడితో, "నన్నతని దగ్గిరికి తీసుకు వెళ్ళు. నే నతనికే అమ్ముడవాలని నిశ్చయించుకున్నాను," అన్నది.

ఆమె పాటగాడి వెంట అతన్ని సమీ పించి, "అయ్యా, నా హృదయంలో జ్యోతి వెలిగించారు. నోటి వెంట పాట ఎందుకు అనరు? నే నింకా ఎక్కువ విలువ చేస్తానని తోస్తే ఇంకా ఎక్కువ పలకండి. లేదా, తక్కువ పలకండి!" అని ప్రాధేయపూర్వ కంగా అడిగింది.

అలీషార్ దైన్యంతో తల అడ్డంగా తిప్పి, "కొనవలసిన నిర్బంధం నాకూ లేదు, అమ్ముడవ వలిసిన నిర్బంధం నీకూ లేదు," అన్నాడు.

జముర్రుద్ అదుర్దాగా, "నేను వెయ్యి దీనారాలు చెయ్యి ననుకున్నట్టున్నారు. తొమ్మిదివందలు పాడండి...పోనీ, ఏని

మిది వందలు!...ఏడు వందలు!...ఆరు వందలు!...ఒక్క వంద!" అన్నది.

అన్నిటికీ తల అడ్డంగా ఆడిస్తూ వచ్చిన అలీషార్, "అంత మొత్తం నా దగ్గిర లేదు," అన్నాడు. జముర్రుద్ ఆనందంతో, "అయితే ఎంత ఉన్నది? మిగతాది ఇంటికి పోయి పంపవచ్చు," అన్నది.

"పిచ్చిపిల్లా, నా దగ్గిర నూరు దీనారాలు కాదు గదా ఒక్క దీనారం లేదు. బంగారునాణెం కాదు గదా, వెండి దిరాము గాని, రాగిబొట్టు గాని లేదు. నన్ను గురించి ఎందుకు వృథా కాలయాపన చేస్తావు? మరొక కొనుగోలుదారును వెతుక్కో," అన్నాడు అలీషార్.

జముర్రుద్ అతనితో, "అయితే అయింది, కొనెయ్యండి. నా చేతి మీద కొట్టి, మీ పైబట్ట నా మీద పరిచి, నా నడుము చుట్టూ చెయ్యివేస్తే నన్ను కొన్నట్టే గుర్తు," అన్నది. అలీషార్ ఆమె కోరిన ప్రకారమే చేశాడు. అతను తన నడుము చుట్టూ చెయ్యి వేసేటప్పుడు ఆమె అతని చేతిలోకి ఒక సంచీ రహస్యంగా పెట్టి, "అందులో వెయ్యి దీనారాలున్నాయి. తొమ్మిది వందలు మా యజమాని కివ్వండి. నూరు మన ఖర్చులకు," అన్నది.



అలీషార్ ఆ సంచిలోని డబ్బులో తొమ్మిది వందలు జముర్రుద్‌ను అమ్మిన వాడి కిచ్చి ఆమెను తన బసకు తీసుకు పోయాడు. ఈ బస చాలా పేదగా ఉంటుందని జముర్రుద్ ముందుగానే ఊహించింది. ఇంటికి వస్తూనే ఆమె మరొక డబ్బు సంచీ అలీషార్ చేతిలో పెడుతూ, "బజారుకు వెళ్ళి ఇంటికి అవసరమైన కర్ర సామగ్రీ, తివాసీలూ, బాలీసులూ కొనండి. ఒక పెద్ద నల చదరపు పట్టు గుడ్డా, బంగారు దారమూ, వెండి దారమూ, ఏడు రంగుల దారపు ఉండలూ, ఒక పెద్ద సూదీ కొనుక్కురండి. భోజన

సామగ్రి కూడా పట్టుకు రండి," అని చెప్పింది. అలీషార్ బజారుకు వెళ్ళి ఆమె చెప్పినవన్నీ, భోజన పదార్థాలతో సహా తెచ్చాడు. జముర్రుద్ ఇల్లు చక్కగా అలంకరించి దీపాలు వెలిగించింది. ఇద్దరూ సుష్టుగా భోజనం చేశారు. ఆ విధంగా వారి దాంపత్య జీవితం ఆరంభమయింది.

జముర్రుద్ తెరలూ, తివాసీలూ తయారు చెయ్యటంలో గొప్ప నేర్పరి. ఆమె ఒక్క క్షణంకూడా విశ్రాంతి లేకుండా పని చేసి ఒక అందమైన తెర తయారు చేసింది. రంగు దారాలతో దానిపై అనేక జంతువులూ, పక్షులూ, ఫలవృక్షాలూ మొదలైనవి జీవకళ ఉట్టి పడేలాగా కుట్టింది. ఈ తెర తయారు కావటానికి వారం రోజులు పట్టింది. అది పూర్తి కాగానే జముర్రుద్ దానిని మడిచి అలీషార్ చేతికిస్తూ, "దీనిని ఏ దుకాణంలోనైనా సరే యాభై దీనారాలకు తక్కువ కాని ధరకు అమ్మెయ్యండి. ఎరిగిన వాడికే బేరం చెప్పండిగాని ముక్కు మొహం తెలియని దారే పోయేవాడితో మటుకు బేరమాడ వద్దు. అలా చేస్తే మనం కష్టాలపాలై పోగలం, జాగ్రత్త!" అని హెచ్చరించింది.

అలీషార్ ఈ నిబంధనకు సమ్మతించి, ఆమె తయారు చేసిన తెరను తెలిసిన దుకాణదారు కొకడికి యాభై దీనారాలకు అమ్మాడు. జముర్రుద్ అతని చేత మళ్ళీ తనకు కావలిసిన పట్టు చదరూ, దారాలూ పగ్గిరాలు తెప్పించి, మరొక వారం శ్రమపడి మరొక తెర తయారు చేసింది. దాన్ని కూడా అలీషార్ యాభై దీనారాలకు తనకు తెలిసిన ఒక దుకాణంలో అమ్మాడు.

ఈ విధంగా వారు తమ అవసరాలకు లోటు లేకుండా జీవిస్తూ వచ్చారు. ఆ రోజు కారోజు వారిద్దరి మధ్యా ప్రేమ అపారంగా పెరగసాగింది.

ఇలా ఉండగా ఒక రోజున—

—(ఇంకా వుంది)





# రాజైన బానిసపిల్ల

## 2

ఒకనాడు అలీషార్ తన భార్య అల్లిన తివాసీ ఒకటి మూటగట్టి తీసుకుని, దానిని విక్రయించటానికి బజారుకు బయలుదేరాడు. అతని కొక దళారీ ఎదురుపడి తివాసీ అమ్మి పెట్టటానికి ఒప్పుకున్నాడు. ఇద్దరూ దుకాణాల ముందుగా వెళుతూ బేరం చెబుతూండగా ఒక క్రైస్తవు డెదురుపడి ఆ తివాసీని అరవై దీనారాలకు కొంటా నన్నాడు. అలీషార్ అమ్మనంటే బేరం నూరు దీనారాలకు పెంచాడు.

కాని అలీషార్‌కు అమ్మటం ఇష్టంలేదు. ఎంచేతనంటే అతనికి క్రైస్తవులంటే అపనమ్మకమూ, అసహ్యమూనూ. అయితే దళారీ మాత్రం అతని చెవిలో ఇంత మంచి బేరం పోనివ్వ వద్దని సలహా ఇచ్చాడు. అసలు సంగతేమిటంటే ఆ క్రైస్తవుడు దళారీకి అదివరకే పది దీనారాలు లంచం పెట్టి ఈ బేరం కుదర్చమని కోరి ఉన్నాడు. తన తివాసీలనూ, తెరలనూ తెలియని వారి కివ్వ వద్దని జముర్రుద్ హెచ్చరించి నప్పటికీ దళారీవాడి నిర్బంధంతో అలీషార్ బేరం ఒప్పుకున్నాడు

డబ్బు తీసుకుని అసంతృప్తిగా అలీషార్ ఇంటిదారి పట్టాడు. కొంతదూరం వెళ్ళి వెనక్కి తిరిగి చూస్తే తివాసీ కొన్నవాడు తన వెనకే వస్తూండటం అతనికి కనబడింది. అతను ఆగి, "మీ జాతివాళ్ళ కీ ప్రాంతంలో ఏమీ పని ఉండదే! ఎందు కిటు వస్తున్నావు?" అని క్రైస్తవుణ్ణి అడిగాడు.

"నా కీ వీధి చివరను కొంచెం పని ఉంది," అన్నాడు క్రైస్తవుడు. కాని అలీ తన ఇంటి గుమ్మం చేరుకునే సరికి పక్క

సి. మాధవరావు



నందులో నుంచి వచ్చి వాడు కూడా హాజరయాడు. "నన్నెందు కిలా వెంటాడుతున్నావురా, పాపిష్టి వెధవా?" అన్నాడు అలీషార్ కోపంగా.

"నేను కావాలని వెన్నంటి రాలేదు. నోరార్చుకుపోతున్నది, దాహానికి కాస్త నీరిప్పించండి, మిమ్మల్ని అల్లా కటాక్షిస్తాడు," అన్నాడు క్రైస్తవుడు.

ఎంత నీచుడికైతేమటుకు దాహమంటూంటే నీరు నిరాకరించటం ఎలా? అలీషార్ తలుపులు తెరిచి ఇంటోకి వెళ్ళి, నీటి కూజా తీసుకుని మళ్ళీ బయటికి పోబోతూండగా జముర్రుద్ తలుపు తెరిచిన అలికిడి విని ఇవతలికి వచ్చి, "ఇవాళ ఇంత అలస్య మయిందేం? తివాసీ అమ్ముడు పోయిందా? కొన్నవాడు పరువైన వర్తకుడా, లేక ఊరూ పేరూ లేనివాడా?" అన్నది.

"ఇవాళ అంగళ్ళలో రద్దీ జాస్తి కావటం చేత కొంచెం అలస్యమయింది. తివాసీని పరువైన వాడికే అమ్మాను," అని అలీషార్ బొంకాడు.

"అ నీ రెవరికి?" అని అమె అనుమానంగా అడిగింది.

"దళారీవాడికి. నాతో వచ్చాడు," అంటూ అలీషార్ బయటికి వెళ్ళాడు.



కాని జానిస మనసులో ఏదో అరాటం సాగింది. ఏదో ప్రమాదం జరగబోతున్నట్టు ఆమెకు తోచింది.

క్రైస్తవుడు వీధిలో నిలబడక తల వాకిలి గుండా నడవలోకి వచ్చేశాడు.

"దొంగ వెధవా, నా అనుమతి లేకుండా నా యింట్లో కెలా అడుగుపెట్టావు?" అని అలీషార్ గద్దించాడు.

"నిలబడటానికూడా త్రాణలేక ఒక్క అడుగు లోపలికి వేశాను. ఇది నడవే గాని ఇల్లు కాదుగదా! ఇదీ వీధిలో జమే. ఒక్క క్షణం విశ్రాంతి తీసుకుని నా దారిన నే పోతాను," అన్నాడు క్రైస్తవుడు. అతను





"మా ఇంట్లో ఇంత ఆహారం కూడా లేదు. మాట్లాడక ఇక బయటికి నడు," అన్నాడు అలీషార్.

అప్పటికీ క్రైస్తవుడు కదల్లేదు. "ఇంట్లో ఏమీ లేకపోతే బజారులో దుకాణం నుంచి మీగడ రొట్టె అయినా తెప్పించండి, లేకపోతే అల్లాపై ఒట్టే! నేను తివాసీకి ఇచ్చిన నూరు దీనారాలు ఇంకా మీ వద్దనే ఉన్నాయిగద. ఆకలిగొన్న వాణ్ణి బయటికి తరమటం మీకు మాత్రం ఏమంత ప్రతిష్ఠ?" అన్నాడు అతను.

ఆ దుర్మార్గుడిపైన అలీషార్‌కు ఎంత మంటగా ఉన్నా వాడి కోరిక తీర్చక తప్ప లేదు. ఉన్నచోటి నుంచి కదల వద్దని క్రైస్త వుణ్ణి హెచ్చరించి, అలీషార్ బయటికి వెళుతూ తలవాకిలికి భద్రంగా తాళంపెట్టి, దుకాణానికి వెళ్ళి వెచ్చ వెచ్చని రొట్టెలూ, హల్వాలూ, పళ్ళూ, ఇతర అపక్వాహారాలూ కొనుక్కుని తిరిగి వచ్చాడు.

అవన్నీ చూసి క్రైస్తవుడు, "ఆహా, ఏమి అతిథిసత్కారం! ఇవన్నీ తెచ్చారెందుకు? వీటితో పదిమందికి విందు చేయవచ్చునే! తమరుకూడా నాతోబాటు భోజనం చెయ్యా లని నా ప్రార్థన," అంటూ అలీషార్‌ను నిర్బంధించి ఒప్పించాడు.

అలీషార్ నుంచి కూజా అందుకుని, నీరు తాగి, కూజా అలీషార్‌కు తిరిగి ఇచ్చేశాడు. వెళ్ళి పోతాడని అలీషార్ ఎంతసేపు చూసినా ఆ క్రైస్తవుడు కదలలేదు.

"ఇంక వెళ్ళిపో!" అన్నాడు అలీషార్.

"అయ్యా, ఒక్క చిన్న ఉపకారం చేస్తే అది కలకాలం ఉంటుంది. అలాటి పనులు చేసే బుద్ధి తమకు అల్లా ఇవ్వలేదా? నా దాహమైతే తీరిందిగాని ఆకలి దహించుకు పోతున్నది. ఏమీ వద్దు, ఇంత ఎండి పోయిన రొట్టెముక్క, ఉల్లిపాయా అయినా సరే నా మొహాన వేస్తే ఆకలి తీర్చుకుంటాను," అన్నాడు క్రైస్తవుడు.

ఇద్దరూ భోజనానికి కూచున్నారు. భోజనం మధ్యలో క్రైస్తవుడు ఒక అరటి పండులో రహస్యంగా మత్తుమందు పెట్టి, "తమరీ పండు నా చేతి మీదుగా పుచ్చుకో వాలి," అని అలీషార్‌కు ఇచ్చాడు. అరటి పండు తింటూనే అలీషార్ స్పృహతప్పి పడిపోయాడు.

మరుక్షణమే క్రైస్తవుడు చివాలున లేచి వీధిలోకి వెళ్ళాడు. అక్కడ అప్పుడే అతని మనుషులు ఒక కంచర గాడిదతో సహా పొంచి ఉన్నారు. వారి వెంట ముసలివాడు రషీద్ అద్దీన్ కూడా ఉన్నాడు. ఈ ముసలి వాడే జముర్రుద్‌ను కొనటానికి ప్రయత్నించి నది. ఇతను వాస్తవానికి క్రైస్తవుడే. కాని వర్తకులలో వెలిగా ఉండకుండా ముసల్మానునని అబద్ధం ఆడుతూ వచ్చాడు. ఈ క్రైస్త వుడు అతనికి సయాం తమ్ముడే. ఇతడి పేరు బర్సూమ్.

బర్సూమ్ తన అన్నతో తన పన్నాగ మంతా వివరంగా చెప్పాడు. అన్నదమ్ము లిద్దరూ, వారి మనుషులూ అలీషార్ ఇంట జొరబడ్డారు. జముర్రుద్ ఉండేచోటికి వెళ్లి, క్షణంలో ఆమె నోట గుడ్డలు కుక్కి, ఆమెను కంచరగాడిదపై వేసి, తిన్నగా ముసలి రషీద్ ఇంటికి తీసుకుపోయారు.



ముసలాడు ఆమెను తన ఇంటిలోని మారుమూల గదిలోకి తీసుకుపోయి, ఆమె నోట కుక్కిన గుడ్డలు తీయించి, "జముర్రుద్, ఇప్పుడు నీవు నా చేతిలో చిక్కావు. ఆ వెధవ అలీషార్ ఈసారి నిన్నెలా కాజేసుకు పోతాడో చూస్తాను. నీవు ఎలాగో నా దానివికాక తప్పేది లేదు. అందుచేత నీ మతం విడిచిపెట్టి నాలాగే క్రైస్తవమతం పుచ్చుకో. లేకపోతే నిన్ను నా నౌకర్లచేత చిత్రహింస చేయిస్తాను. నీ పాట్లు కుక్కలు కూడా పడవు," అన్నాడు.

జముర్రుద్ కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ కూడా, "ముసలి పీనుగా, నన్ను



89

ముక్కలు ముక్కలుగా కోసినా, నా మతాన్ని వదులుకోను," అన్నది.

దానిమీదట ఆ ముసలివాడు ఆమెను తన చేతులు నొచ్చేదాకా కొట్టి, "దీన్ని వంట ఇంటి బానిసలతో చేర్చండి. అన్నమూ, నీరూ ఇవ్వకండి," అని నౌకర్లతో చెప్పాడు.

* * *

అక్కడ అలీషార్ కొంతసేపటికి మత్తు వదిలి లేచి కూచుని, "ఓ జముర్రుద్!" అని కేకపెట్టాడు, కాని జవాబు లేదు. అతను లేచి ఆమె ఉండే గదికి వెళ్ళి చూస్తే ఆమె వల్లెవాటూ, రుమాళ్ళూ చిందర వందరగా పడి ఉన్నాయి. ఇవి చూడగానే క్రైస్తవుడు జ్ఞాపకం వచ్చాడు. వాడే తన ప్రియురాలిని తీసుకుపోయాడని అర్థమై అలీషార్‌కు దుఃఖం పొంగి వచ్చింది. ఆ దుఃఖం శృతి మించి అతని మతే పోయి నట్టయింది. అతను, "అయ్యో, జముర్రుద్!" అని కేకలు పెట్టి, రొమ్ము బాదుకుంటూ వీధిన పడ్డాడు. త్వరలోనే అనేకమంది కుర్రాళ్ళు, "పిచ్చివాడు! పిచ్చివాడు!" అని కేకలు వేస్తూ అతని వెంట పడ్డారు. అతన్నెరిగిన వాళ్ళుకూడా, "పాపం, పిచ్చెత్తింది కాబోలు," అని జాలిపడ్డారు.

ఇలా అతను నగరమంతా కలయ దిరుగు తుండగా ఒక ముసలిది అతని కెదురు పడి,



"నా తండ్రే! నీ కీ స్థితి ఎందుకు వచ్చింది, నాయనా?" అని అడిగింది.

అలీషార్ తన దీన చరిత్ర ఆమెతో చెప్పుకున్నాడు. ఆ ముసలిది దీర్ఘంగా ఆలోచించి, "చూడూ, బజారుకు వెళ్ళి ఆడవాళ్ళు కొనే పూసలూ, గాజులూ, వెండి పూతగల ఉంగరాలూ, జుమికీలూ కొని ఒక తట్టలో పెట్టి తేగలవా? ఆ తట్ట నెత్తిన పెట్టుకుని ఇల్లిల్లూ తిరిగి, నీ జముర్రుద్ ఎక్కడ ఉన్నదీ తెలుసుకుని, చాతనైతే నీకు చేర్చటానికి యత్నిస్తాను," అన్నది.

ఈ మాట విని అలీషార్‌కు ప్రాణం లేచి వచ్చింది. అతను ఆనందాశ్రువులు రాల్చి, ఆమె చేతులు కళ్ళ కద్దుకుని, బజారుకు వెళ్ళి ఆమె కోరిన వస్తువు లొక తట్టలో పెట్టి తెచ్చి ఇచ్చాడు. ఆమె ఇంటికి వెళ్ళి దుస్తులు మార్చుకుని, ముఖానికి బురఖా వేసుకుని, తట్ట నెత్తిన పెట్టుకుని, కర్ర ఒకటి తాటించుకుంటూ నగరంలో ఉండే గొప్ప వర్తకుల ఇళ్ళకెల్లా వెళ్ళి ఆడవాళ్ళ నందరినీ చూస్తూ రాసాగింది.

చివరకామె రషీద్ ఇంటికి కూడా వెళ్ళింది. ఆమె అమ్మకానికి తెచ్చిన వస్తువులు చూడటానికి ఆడ బానిస లందరూ మూగారు. వారి కామె అన్ని వస్తువులూ







అమ్మా? అతను నన్ను నీ కోసమే పంపాడు రేపు చీకటిపడే సమయానికి వంటింటి కిటికీ వద్ద వేచి ఉండి, వీధి నుండి ఈల వినబడ గానే జవాబుగా ఈల వేసి, నిర్భయంగా బయటికి వచ్చెయ్యి. అతను నీ కోసం వేచి ఉంటాడు," అని చెప్పింది.

ఆ తరవాత ముసలిది అలీషార్ వద్దకు వెళ్ళి, "రేపు చీకటి పడే వేళకు ఫలాని కిటికీ కింద వీధిలో వేచి ఉండు," అంటూ అతనేమేం చెయ్యాలో చెప్పింది. అలీషార్ ఆమెకు తన కృతజ్ఞత చెప్పుకుని బహు మానంగా ఏదో ఇయ్యబోతే, ముసలిది తీసుకోక, "నీ ప్రయత్నం నిర్విఘ్నంగా సాగితే అదే పదివేలు," అని తన ఇంటికి వెళ్ళిపోయింది.

మర్నాడు చీకటిపడే సమయానికి అలీ షార్ రషీద్ ఇంటి బయట వంటింటి కిటికీ వద్దకు చేరి, అక్కడ గోడ నానుకుని సమయం కోసం ఎదురు చూస్తూ కూచున్నాడు. కాని అప్పటికి రెండు రాత్రులుగా నిద్రలేని కారణం చేత అతనికి నిద్రముంచుకు వచ్చేసింది.

ఆ సమయంలో ఒక గజదొంగ అటుగా వచ్చాడు. ఆ రాత్రి ఆ ఇల్లు కొల్లగొట్టే ఉద్దేశంతో వాడు ఇంటిని తనిఖీ చేయటానికి

చూపటమేగాక చాలా తక్కువ ధరలు చెప్పింది. అందరూ తమకు కావలిసిన వస్తువులు కొనుక్కున్నారు.

ముసలిది చుట్టూ కలయ చూసేసరికి, దెబ్బల బాధతో తీసుకుంటూ ఒక చాప మీద పడి ఉన్న జముర్రుద్ కనిపించింది. వెంటనే ఆమెకు ఆ మనిషే తాను వెతుకుతున్న జముర్రుద్ అని తోచింది; ఎందుకంటే మిగతా బానిసలు ఆమెను గురించి చెప్పిన వివరాలు అలీషార్ చెప్పిన వివరాలకు అతికినట్టుగా సరిపోయాయి.

అందుచేత ముసలిది ఆమెను సమీ పించి, "నీవు అలీషార్ బానిసవు కావా



వచ్చాడు. వాడటుగా వస్తూనే నిద్రపోతున్న అలీషార్‌ను చూశాడు. ఖరీదైన అతని దుస్తులు చూసి వాడికి కళ్ళుకుట్టాయి. వాడు నేర్పుగా అలీషార్ తలపాగా, పై బట్టా సంగ్రహించి తాను ధరించాడు.

అదే సమయంలో ఎత్తున ఉండే కిటికీ తెరుచుకున్నది. ఒక స్త్రీ ఆకారం దొంగ కంట పడింది. ఆ స్త్రీ కిందికి చూసి ఈల వేసింది. దొంగవాడు తిరిగి ఈల వేశాడు. మరుక్షణం లోపలి నుంచి ఒక తాడు కిందికి జారింది. కిటికీలో నుంచి కనబడిన స్త్రీ కిటికీలోకి ఎక్కి ఆ తాడు పట్టుకుని కిందికి వచ్చింది. దొంగ మరి ఆలోచించక ఆమె దిగటానికి తన వీపు ఇచ్చి, బలంగలవాడు కావటంచేత ఆమెను మోసుకుంటూ వాయు వేగంతో పరిగెత్తసాగాడు.

దొంగను చూసి తన భర్తే అనుకున్న జముర్రుద్ ఆ దొంగతో, "అలీషార్, నీకు నడిచే శక్తికూడా లేదని ముసలిది చెప్పింది గదా, గుర్రంలాగా పరిగెత్తే శక్తి నీ కెలా వచ్చింది?" అని అడిగింది. ఈ ప్రశ్న విని దొంగ తన వేగం మరింత హెచ్చించాడు. అనుమానం వేసి జముర్రుద్ దొంగవాడి ముఖం తడివింది. అతని గడ్డం చీపురు కట్టలాగా ఆమె చేతికి తగిలింది. ఆమెకు



చెప్పరాని భయం పట్టుకున్నది. "ఎవడవురా నువ్వు? ఎవడవురా?" అంటూ ఆమె వాణ్ణి ముఖం మీద కొట్టింది.

ఈ సరికి దొంగ నిర్మానుష్యమైన చోటికి చేరాడు. వాడు జముర్రుద్‌ను కిందికి దించి, "నే నెవరినా? నా పేరు జవాన్, దొంగను. మా ముఠాలో నలభై మందిమి ఉన్నాం. మాకు అడడన్నది లేదు. నీ అదృష్టం. నువ్వు మా అందరికీ పెళ్ళాం కాబోతున్నావు!" అన్నాడు.

ఈ మాట చెప్పి వాడు ఆమెను మళ్ళీ తన వీపున ఎత్తుకుని కొండల్లో తమ ముఠా ఉండే గుహకు తీసుకుపోయాడు.

జవాన్ జముర్రుద్‌ను తన ముసలి తల్లికి అప్పగించి, "ఇవాళ రాత్రి మేం చెయ్యవలసిన దొంగతనాలు కొన్ని ఉన్నాయి. రేపు మధ్యాహ్నని కల్లా మేము సలభై మందిమీ వస్తాము. అంతదాకా ఈ మనిషిని జాగ్రత్తగా చూస్తూ ఉండు," అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి జముర్రుద్ కన్ను మూయలేదు. తెల్లవారే లోపుగా ఆమె తన భయాన్ని వదిలించుకుని ధైర్యాన్ని చిక్క బట్టుకోగలిగింది. ఆమె తప్పించుకు పారిపోయే ఆలోచన కూడా చేసింది.

ఆమె ముసలిదానితో, "అత్తా, మధ్యాహ్నం దాకా వాళ్ళంతా రారుగదా? అందాకా మనకు పనీపాటూ ఉండదు. అలా ఎండలో కూచుందామా? నీ తల్లో పేలు చూస్తాను!" అన్నది.

ముసలిది, "అంతకంటేనా? ఈ దిక్కుమాలిన గుహలో ఒక తలంటూ, పాడా? తల నిండా పేలే. రాత్రిళ్ళు ఒళ్ళంతా పాకుతాయి. వాటిని వదలగొట్టితివా నిన్ను ఎంత బాగా చూడాలో అంతబాగా చూస్తాను," అన్నది. ఇద్దరూ ఎండలో చేరారు. జముర్రుద్ ముసలిదాని తల దువ్వి చాలా భాగం పేలు తీసేసింది. తరవాత జుట్టు పాయలు తీస్తూ ఈళ్ళు గోళ్ళతో కుక్క సాగింది. ఆమె గోళ్ళ కింద ఈళ్ళు చిటుకు చిటుకుమంటూంటే ముసలిదానికి జోకొట్టినట్టయి నిద్ర వచ్చేసింది.

జముర్రుద్ ముసలిదాన్ని వదిలేసి చప్పున గుహలోకి వెళ్ళింది. లోపల ఎన్నో రకాల దుస్తు లున్నాయి. అన్నీ దొంగిలించినవే. జముర్రుద్ మగవాడి దుస్తులు ధరించింది. ఖరీదైన తలపాగా పెట్టుకున్నది. బయటికి వచ్చి, అక్కడ కట్టేసి ఉన్న ఒక గుర్రాన్నెక్కి, దేవుణ్ణి స్మరించుకుని శరవేగంతో బయలుదేరిపోయింది.

—(ఇంకా వుంది)






# రాజైన బానిసపిల్ల

## 3

దొంగల నుంచి తప్పించుకుపోయిన జముర్రుద్ చీకటి పడినదాకా ఆగకుండా స్వారి చేసింది. మళ్లీ మర్నాడు ఉదయమే గుర్ర మెక్కి రోజల్లా ప్రయాణించింది; దారిలో దుంపలు తవ్వి తిని కడుపు నింపు కోవటానికీ, గుర్రాన్ని మేతకు విడవటానికీ తప్ప ఆమె ఆగనే లేదు. పదిరోజు లీవిధంగా ఇసుక ఎడారిలో పడి ప్రయాణించినాక ఆమెకు మళ్ళీ సస్యశ్యామల ప్రదేశం కంట పడింది. ఎక్కడ చూసినా పచ్చికబయళ్ళూ, సెలయేళ్ళూ, చెట్లూ, పూలూ, నీడలూ కనిపించి ఆమె కళ్ళు తనిశాయి. జముర్రుద్ ఈ ప్రదేశంలో కొంత సేపు విశ్రాంతి తీసుకుని, మళ్ళీ గుర్రమెక్కి ఒక రహదారి వెంట వెళ్ళి ఒక మహానగరం చేరుకున్నది. ఆమె నగర ద్వారాన్ని చేర వచ్చేసరికి అక్కడ జనం తండోపతండాలుగా చేరి ఉండి, ఆమెను చూసి వెర్రిగా హర్ష ధ్వానాలు చేస్తున్నారు.

అంతలోనే నగర ద్వారం తెరుచుకున్నది. నగరపు పెద్దలూ, కులీనులూ గుర్రా లెక్కి ఆమెకు ఎదురు వచ్చి, రాజు గారికి సభికులు వందనాలు చేసే రీతిగా, వంగి సలాములు చేశారు. ఇదే సమయంలో జనం, "సుల్తానుగారికి జై!" అని నినాదాలు చేశారు. రక్షకభటులు వచ్చి జనాన్ని దూరంగా ఉంచారు.

పురుష వేషంలో ఉన్న జముర్రుద్‌కు ఇదంతా అగమ్యగోచరంగా ఉంది. ఆమె నగరపు పెద్దల కేసి తిరిగి, "అయ్యలారా, మీ నగరంలో ఈ జాతర దేనికి? మీకు నాతో ఏం పని?" అని అడిగింది.

సి. మాధవరావు




"స్వామీ, మా నగరాన్ని పరిపాలించమని అల్లా తమరిని పంపాడు. ఆయన సర్వజ్ఞుడు. అందుచేతనే మాకు తమలాటి యువకుడైన కులీనుణ్ణి రాజుగా నిర్ణయించాడు!" అన్నారు వారు.

వారిద్వారా జముర్రుద్ అక్కడి ఆచారం గురించి తెలుసుకున్నది. ఈ నగరాన్ని ఏలే రాజులు నిస్సంతుగా చనిపోవటం జరిగితే, అక్కడి ప్రజలు నగరం వెలపలికి వచ్చి, తమ నగరానికి వచ్చే మొట్టమొదటి మనిషిని రాజుగా ఎన్నుకుంటారు. ఈ ఆచారం ప్రకారం జముర్రుద్ తలవని తలంపుగా ఈ నగరానికి రాజయింది.



ఆమె తనలో కలిగే ఆశ్చర్య సంభ్రమాలను పైకి కనబడనివ్వక, బింకంగా వారితో, "నేనైనా కులీనుణ్ణేగాని సాదా మనిషిని కాను. ఇంట్లో పోట్లాడి ప్రపంచం చూడటానికి బయలుదేరి ఇలా వచ్చాను. దైవికంగా నేను మిమ్మల్ని పరిపాలించవలిసిన పరిస్థితి ఏర్పడింది గనక అందుకు సిద్దంగానే ఉన్నాను," అన్నది.

ఈ మాట అని ఆమె తన గుర్రాన్ని ఊరేగింపులో ముందు పోనిచ్చింది. ఆమె వెనకగా నగరపు పెద్దలూ, ఉన్నతాధికార్లూ బయలుదేరారు.

ఊరేగింపు రాజభవనం ముందు ఆగిపోయింది. జముర్రుద్ భవనం ప్రవేశించి రాచదుస్తులు ధరించింది. ఆమెను సింహాసనం పై కూచోబెట్టి అందరూ ఆమె ముందు సాష్టాంగ పడి రాజభక్తి ప్రమాణాలు చేశారు.

జముర్రుద్ ముందుగా ప్రజలకు దానధర్మాలు చేసింది. ఖజానాలో ఎంతో కాలంగా మూలుగుతున్న డబ్బును పేదసాదలకు పంచి పెట్టింది. రాజభవనంలోని నౌకర్లకు వస్త్ర దానాలు చేసింది. పెద్ద అధికార్ల కందరికీ కానుక లిచ్చింది. అందరూ ఆమెను వెయ్యేళ్ళు పరిపాలించమని దీవించారు. తమ రాజు ఆడదని

వారికి ఏపాటి అనుమానమూ కలగలేదు. ఆమె పరస్త్రీలను, కన్నెత్తికూడా చూడక పోవటం గమనించి, "ఆహా! మన సుల్తాను ఎంత నీతి పరుడు!" అని మెచ్చుకున్నారు.

ఇంత జరిగినా ఆమెకు ఆనందం లేక పోయింది. ఆమె తన భర్త అయిన అలీ షార్‌ను ఒక్క క్షణం కూడా మరవలేదు. అతని కోసం ఆమె రహస్యంగా జరిపించిన అన్వేషణలన్నీ విఫలమయాయి. అలీషార్ తనకు మళ్ళీ కనిపించగలందులకు ఆమె ఉపవాసాలు చేసింది, అంతులేని ప్రార్థనలు చేసింది. "మన సుల్తానుగారిది ఎలాటి దైవభక్తి!" అనుకున్నారు నౌకర్లు.

ఒక సంవత్సరం గడిచాక జమ్రుదుద్‌కు ఒక ఆలోచన కలిగింది. ఆమె నగరంలో ఒక విశాలమైన ప్రదేశం ఖాళీ చేయించింది. నగరవాసులందరూ కూచుని విందు భోజనం చెయ్యటానికి వీలయినంత పెద్ద మండపం కట్టించింది. అందులో ఒక పక్కగా సింహా సనమూ, మంత్రులు మొదలైనవారి ఆస నాలూ ఉన్నాయి. మిగిలిన స్థల మంతటా సామాన్య ప్రజలకు ఆసనాలు అమర్చారు. "ఇది మొదలు ప్రతి నెలా మొదటి రోజున ఈ మంటపంలో సమారాధాన విందు చేస్తాం. ఆ రోజు నగరంలోని



యావన్మంది పురుషులూ వచ్చి భోజనం చెయ్యాలి. రానివారికి శిరశ్ఛేద శిక్ష. ఈ విధంగా చాటింపు వేయించండి," అని ఆమె తన మంత్రులకు చెప్పింది.

అలాగే చాటింపు వేశారు. మరుసటి నెల మొదటి రోజున నగరంలోని ధనికులూ, పేదలూ, వర్తకులూ బిచ్చగాళ్ళూ మంట పానికి వచ్చి విందుకు కూచున్నారు. బల్లల మీద రకరకాల వంటకాలు పెట్టి ఉన్నాయి. ఎవరి ఆసనాలకు సమీపంలో ఉండే వంట కాలను వారు అంది తీసుకుంటున్నారు.

విందు జరుగుతున్నంతసేపూ జమ్రుదుద్ ప్రతి మనిషినీ పరకాయించి చూస్తూ

వచ్చింది. "సుల్తానువారు నా కేసి అంత పరీక్షగా ఎందుకు చూస్తున్నారో!" అని చాలామంది ఆశ్చర్య పడ్డారు. "ఆహా! ప్రజలపై ఇంత అభిమానం గల రాజులు కూడా ప్రపంచంలో ఉంటారా! ఏమి విందు!" అని చాలామంది అనుకున్నారు.

ఆ రోజు దైవికంగా ఆ విందులో పాల్గొంటున్న వారిలో అలీషార్‌కు మత్తు మందు పెట్టి జముర్రుద్‌ను తస్కరించిన బర్సూమ్ కూడా ఉన్నాడు. ఆ నీచుడు తనకు అందుబాటులో ఉండే వంటకాలన్నీ అంది పుచ్చుకుని ఆత్రంగా తినేసి, దగ్గిరలో ఏమీ లేకపోయేసరికి, దూరంగా ఉన్న ఒక పళ్ళెం అందుకుని అందులో ఉన్న మీగడ హల్వా పట్టెడు తీసి నోట కుక్కుకున్నాడు.

ఈ చర్య చూసి బర్సూమ్‌కు అటూ ఇటూ కూచున్నవాళ్ళకు రోత కలిగింది. "ఎవరయ్యా నువ్వు? నీకు అతిథి మర్యాద కూడా తెలియదే! అందుబాటులో ఉన్నది తింటారుగాని కనిపించిన దల్లా తీసుకు తింటారా?...అంతా ఒక్కడివే బొక్కేస్తున్నావు, కడుపు నొప్పి వచ్చేను!" అని నానా మాటలూ అన్నారు.

ఎవరేమన్నప్పటికీ వినిపించుకోకుండా బర్సూమ్ మరొక పట్టెడు హల్వా తీసుకుని నోట పెట్టుకోబోతుండగా జముర్రుద్ అతన్ని



గుర్తించి, "ఆ హల్వా తినే వాణ్ణి పట్టి తీసుకురండి!" అని భటులను ఆజ్ఞాపించింది. వాళ్ళు వచ్చి బర్సూమ్ మీదపడి, కింద పడేసి జరజరా ఈడ్చుకుపోయారు.

ఈ సంఘటన అందనీ ఆశ్చర్య చకితులను చేసింది.

జముర్రుద్, బర్సూమ్‌ను చూసి కళ్ళ నిప్పులు రాలుస్తూ, "ఏమిరా? నీ పేరేమిటి? నువు మా నగరానికి ఏం పని మీద వచ్చావు?" అని అడిగింది.

"మహారాజా, నా పేరు అలీ: నేను జల్తారు పనివాణ్ణి. వర్తకం కోసం తమ నగరానికి వచ్చాను," అన్నాడు బర్సూమ్.

జముర్రుద్ తన నౌకరు చేత తన వద్ద ఉండే ఇసుక పెట్టే, రాగి పుల్లా తెప్పించింది. ఇసుకలో ఏవో పిచ్చి గీతలు గీసింది. వాటిని నిదానంగా పరిశీలించినట్టు నటించింది. చివరకు బర్సూమ్ కేసి తిరిగి రౌద్రకంఠంతో, "నా తోనే అబద్ధాలాడతావురా, బద్మాష్? నీ అసలు పేరు బర్సూమ్ కాదూ? నువొక బానిసపిల్లను మాయ చేసి ఎత్తుకు పోలేదూ? దాన్ని వెతుకుతూ కాదూ నీ వీ నగరం వచ్చింది?" అని కేకలు పెట్టింది.

బర్సూమ్ వణికిపోతూ ఆమె కాళ్ళపైన పడి, అంతా నిజమేనని ఒప్పుకున్నాడు. ఇది చూసి ప్రజలందరూ ఆశ్చర్య చకితులై





హాహాకారాలు చేసి, "మన ప్రభువులాటి దైవజ్ఞులు ప్రపంచంలో మరెక్కడైనా ఉంటారా!" అన్నారు.

జముర్రుద్ తన భటులను పిలిచి, "ఈ నీచుణ్ణి చిత్రవధ చెయ్యండి!" అని ఆజ్ఞాపించింది. జనులు ఆమె ఇచ్చిన శిక్ష సరి అయినదని ప్రశంసించారు.

బర్సూమ్ సమీపంగా కూచుని భోజనం చేసినవారు మీగడ హల్వా జన్మలో తినమని ఒట్లు పెట్టుకున్నారు. అదే బర్సూమ్ చావుకు కారణమయిందని వారి అనుమానం!

అందుచేత మరసటి నెల ఆరంభంలో తిరిగి విందు జరిగినప్పుడు మీగడ హల్వా పళ్ళెం ఉన్న చాయల ఎవరూ కూచోలేదు. దాని కేసి ఎవరూ చూడనైనా లేదు. సుల్తాను తమ కేసి పరీక్షగా చూస్తూ ఉండటం గమనించి ప్రతి ఒక్కరూ తమ కెదురుగా ఉండే తినుబండారాలు మాత్రమే తిన్నారు.

విందు సాగుతూన్న సమయంలో ఒక మొరటు మనిషి అక్కడికి వచ్చాడు. ఖాళీ స్థలం కోసం చాలాసేపు వెతికిన మీదట మీగడ హల్వా పళ్ళెం ఎదురుగా ఖాళీ దొరికింది. వాడు అక్కడ కూచుని ఆ పళ్ళెం తన కేసి లాక్కున్నాడు.

ఈ వచ్చిన వాడు జవాన్ అన్న దొంగ. తన తల్లిని మభ్యపెట్టి పారిపోయిన జముర్రుద్‌ను వెతుక్కుంటూ వాడీ నగరం వచ్చి విందుకు హాజరయాడు. వాణ్ణి చూస్తూనే జముర్రుద్ గుర్తించి, వాణ్ణి ఈడ్చుకు రమ్మని తన భటులను పంపింది. జవాన్ ఒక పట్టెడు హల్వా నోట వేసుకుని దిగమింగి, రెండో పట్టు పట్టుతూండగా భటులు వాడి పైన పడి, క్షణంలో పెడరెక్కలు విరిచికట్టి తమ సుల్తాను దగ్గిరికి ఈడ్చుకుపోయారు.

"నువెవరు? ఏం చేస్తావు? ఎందుకు మా నగరానికి వచ్చావు?" అని జముర్రుద్ వాణ్ణి ప్రశ్నించింది.



"నా పేరు ఉథ్మాన్. తోటమాలిని. పని కోసం ఈ నగరం వచ్చాను," అన్నాడు జవాన్. జముర్రుద్ వెనకటిలాగే ఇసుకా, రాగి పుల్లా తెప్పించి, ఏదో గీతలు గీసి, వాటిని పరీక్షించినట్టు నటించి, "ఓరి లుచ్ఛా, నీ పేరు జవాన్. నువు దొంగ తనాలూ, హత్యలూ చేసే వాడివి. నిజం ఒప్పుకుంటావా? చావ గొట్టించమన్నావా?" అని అడిగింది.

తనతో మాట్లాడుతున్నది తాను ఎత్తుకు పోయిన పిల్లే నన్న అనుమానం వాడికి కలగ లేదు. వాడు భయంతో పాలిపోయి, తోడేలు లాటి నోరు తెరిచి వగర్చుతూ, "తమరన్నది నిజమే, ప్రభూ. ఇక నుంచీ నా బ్రతుకు మార్చుకుంటాను," అన్నాడు.

"నిన్ను బతకనివ్వటం ధర్మహాని! వీణ్ణి తీసుకుపోయి చిత్రవధ చెయ్యండి," అని జముర్రుద్ భటులను ఆజ్ఞాపించింది.

రెండోసారి కూడా ఇలాగే జరగటంతో జనానికి ఆ మీగడహల్వా అంటే హడలెత్తి పోయింది. దాన్ని తాకిన వాడికి చావు తథ్య మన్న అభిప్రాయం జనంలో పాకిపోయింది.

అందుచేత మరొక నెల గడిచి మరొక విందు జరిగినప్పుడు జనం ఆ హల్వా పళ్ళానికి సాధ్యమైనంత ఎడంగా కూచు న్నారు. దానిముందు ఒక్కరూ కూచోలేదు.



ఆ రోజు అక్కడికి ఒక తెల్ల గడ్డం ముస లాడు వచ్చాడు. విందులో పాల్గొననివాళ్ళని ఉరితీస్తారని ఈ ముసలాడికి తెలుసు. కాని ఎక్కడా చోటు లేదు. అందుచేత వాడు వచ్చి హల్వా పళ్ళెం ముందున్న ఖాళీ జాగాలో కూచున్నాడు.

ఈ వచ్చినవాడు రషీద్—జముర్రుద్‌ను వేలంలో కొనటానికి యత్నించి, సాధ్యంకాక, ఆవిడను ఎత్తుకు రావటానికి తన తమ్ము డైన బర్సూమ్‌ను నియోగించిన నీచుడు. ఆమెను వెతకటానికి వెళ్ళిన తన తమ్ముడు నెల గడిచినా తిరిగి రాకపోవటం చూసి రషీద్ తానే ఈ నగరానికి చేరుకున్నాడు.



మీగడహల్వా పళ్ళెం ముందున్న స్థలంలో కూచుంటూండగానే రషీద్‌ను జముర్రుద్ పోల్చింది. "ఈ మీగడహల్వా మహిమ ఏమిటో గాని పనికిమాలిన లుచ్చాలందరినీ ఇది ఆకర్షిస్తోంది," అని ఆమె అనుకుని, రషీద్‌ను పట్టి లాక్కురమ్మని తన భటులను పంపింది. వాళ్ళు వెళ్ళి రషీద్‌ను కిందపడేసి, గడ్డం పట్టుకుని ఈడ్చుకు వచ్చి జముర్రుద్ ఎదట పెట్టారు.

"నీ పేరేమిటి? వృత్తి ఏమిటి? ఈ నగరానికేం పని మీద వచ్చావు?" అని ఆమె రషీద్‌ను అడిగింది.

"ప్రభూ, నా పేరు రుస్తుం. నాకు దారిద్ర్యం తప్ప వేరే వృత్తి లేదు. నేను ఫకీరును," అన్నాడు రషీద్.

జముర్రుద్ ఇసుక తెప్పించి, గీతలు గీసి, వాటిని పరీక్షించినట్టు నటించింది. తర్వాత రషీద్ కేసి తిరిగి, "కుక్కా, రాజుతోనే అబద్ధాలాడావు. నీ అసలు పేరు రషీద్ అల్దీన్. ముస్లిము స్త్రీలను బలాత్కరించటం నీ వృత్తి. నిజం ఒప్పుకో!" అన్నది.

లేకపోతే ప్రాణాలు దక్కవని రషీద్ నిజం ఒప్పేసుకున్నాడు. కాని జముర్రుద్ వాడికి చిత్రవధే విధించింది.

విందు యథావిధిగా ముగిసింది. తమ యేలిక యొక్క సామర్థ్యాన్ని ప్రజలు తెగ మెచ్చుకున్నారు.

విందు ముగిసినాక జముర్రుద్ తన భవనానికి తిరిగి పోయింది. తన శత్రువుల పైన పగ తీర్చుకున్నందుకు ఆమె మనసు తేలికపడిందేగాని ఆనందం కలగలేదు. అలీషార్ దొరికితేగాని ఆమెకు ఆనందం కలగదు.

"నా కోరిక తీర్చే భారం ఆ సర్వశక్తిమంతుడైన దేవుడి పైనే ఉన్నది," అనుకుంటూ ఆమె ఆ రాత్రంతా కన్నీరు కార్చి, ఆ నెల అంతా తన రహస్య మందిరంలోనే ఉండిపోయి ఎవరికీ తన ముఖం చూపలేదు.

—(ముగింపు వచ్చే సంచికలో)





# రాజైన బానిసపిల్ల

## 4

అక్కడ ముసలిదాని సహాయంతో తన ప్రియురాలున్న చోటు తెలుసుకుని కూడా తెలివి తక్కువగా నిద్రపోయిన అలీషార్ మర్నాడుదయం నిద్రలేచి తాను వీధిలో పడుకుని ఉన్నందుకు ఆశ్చర్యపోయాడు. తల తడివి చూసుకుంటే తలపాగా లేదు, అతని పై బట్టకూడా పోయింది; ఆ రెంటినీ దొంగ కాజేశాడు.

అతను లేచి వెళ్ళి తాను చేసిన పొరపాటు ముసలిదానితో చెప్పి, జముర్రుద్ ఏమయిందో కనుక్కు రమ్మని ఆమెను పంపాడు. ఒక గంట అయాక ఆమె విచారంతో తిరిగి వచ్చి, "నాయనా, జముర్రుద్ మాయమయింది. ఆమె మళ్ళీ నీకు దొరుకుతుందని నా కేమీ నమ్మకం లేదు. నీ పొరపాటు చేతనే ఈ విపత్తు కలిగింది. నీ కింక సహాయ పడగలవాడు అల్లా ఒక్కడే," అన్నది.

ఈ మాటలు వినగానే అలీషార్ కళ్ళు చీకట్లు కమ్మాయి. అతను పెద్ద పెట్టున ఏడుస్తూ కొంతసేపటికి మూర్ఛపోయాడు. ముసలిదాని పరిచర్యల వల్ల అతనికి స్పృహ అయితే వచ్చింది కాని అతను మనోవ్యాధితో మంచం పట్టాడు. ఈ స్థితిలో అతనికి నిద్ర కూడా లేకుండా పోయింది. ముసలిది వెయ్యి కళ్ళతో అతన్ని కనిపెట్టి ఉండి ఉపచారాలు చెయ్యకపోతే అతను శీఘ్రమే మరణించ వలసినవాడే. అలాగే అతను ఒక ఏడాదిపాటు మంచంలో ఉండి తీసుకున్నాడు.

అలీషార్‌ను మామూలు మనిషిని చెయ్యటానికి వృద్ధురాలు అన్ని విధాలా

సి. మాధవరావు



ప్రయత్నించింది. అతనికి జముర్రుద్ దొరుకుతుందనే ఆశ పూర్తిగా లేకుండా పోవటం చేతనే కోలుకునే శక్తికూడా లేకుండా పోయింది. ఇది గ్రహించి వృద్ధురాలు, "నాయనా, నువీ మంచంలో పడి ఉన్నంత కాలమూ నీకు నీ ప్రియురాలు కనిపించే మాట కల్ల. సరి అయిన ఆహారం తీసుకుని, బలం తెచ్చుకుని లేచి తిరిగితే, నానా దేశాలూ చూస్తే ఆమె నీకు దొరక వచ్చు," అని పదే పదే చెప్పింది.

ఈ విధంగా ముసలిది చెప్పగా చెప్పగా ఆమె మాటలు అతని చెవి కెక్కాయి. అతను లేచి ఆమె వెంట స్నానశాలకు వెళ్ళాడు. ఆమె అతని చేత చక్కగా స్నానం చేయించి, షర్బతులు తాగించి, కోడి మాంసం తినిపించింది. ఇలా ఒక నెలపాటు చేసిన మీదట అలీషార్‌కు ప్రయాణం చేసే పాటి శక్తి వచ్చింది.

అతను ముసలిదానికి వీడ్కోలు చెప్పి ప్రయాణిస్తూ కాలక్రమాన జముర్రుద్ పరిపాలించే నగరానికి వచ్చి చేరాడు.

ఇదే సమయానికి ఈ నగరంలో నాలుగో విందు జరిగింది. విందులో ఒక పక్క జముర్రుద్ సపరివారంగా కూచుని అందరినీ పరిశీలించసాగింది. పౌరులందరూ ఎప్పటి లాగే విందుకు వచ్చి కూచున్నారు, కాని మీగడహల్వా ఉన్నచోట ఎవరూ కూచో లేదు. దాని దుష్ప్రభావాన్ని వారు మూడు సార్లు ప్రత్యక్షంగా చూసి ఉన్నారు.

అలీషార్ అక్కడికి వచ్చాడు. అతనికి ఆ మీగడహల్వా ముందు మాత్రమే ఖాళీ కనిపించింది. అతను ఆ ఖాళీలో కూచున్నాడు. చుట్టుపక్కల వాళ్ళంతా అతని కేసి భయంతో చూడసాగారు.

అతను అక్కడ కూచుంటూండగానే జముర్రుద్ అతన్ని చూసి గుర్తించింది. వెంటనే ఆమె గుండె దడదడా కొట్టుకో సాగింది. తన కంగారు తన భృత్యులు

గమనించకుండా ఉండగలందులకు కొంచెం సేపు ఏమీ చెయ్యకుండా ఊరికే ఉండి పోయింది. అలీషార్ తన ముందున్న మీగడ హల్వా తినటం గమనించింది. అతను కడుపు నిండా తిన్నదాకా అతన్ని పిలిపించ గూడదని ఆమె నిశ్చయించుకున్నది.

ఈ యువకుడెవడో వచ్చి మీగడహల్వా ముందు కూచుని నిరాటంకంగా తనకు కావలిసినంతా తినటం అతని చుట్టూ కూచున్నవారికి ఆశ్చర్యం కలిగించింది. ఎందుకంటే అదివరకు దాన్ని నోట పెట్టు కున్నవారికి రెండో కబళం దక్క లేదు— ఈ లోపలనే రాజభటులు వచ్చి జరజరా లాక్కుపోయారు. ఆ తరవాత వారు ప్రాణాలే కోల్పోయారు. కాని ఈ యువకుడు ఏ అపాయమూ లేకుండా తనకు కావలిసిన దంతా తినేసి, తన భోజనం పూర్తి అయి నట్టు గుర్తుగా కళ్ళు మూసుకుని దైవ ప్రార్థన చేస్తూ నోరు అడించాడు.

అతని భోజనం అయిపోయిందని గ్రహించి జముర్రుద్ తన భటులను పిలిచి, "మీరు వెళ్ళి, ఆ మీగడహల్వా తినే యువకుణ్ణి మర్యాదగా పలకరించి, నాతో మాట్లాడటానికి ఒక్కసారి రమ్మని అడగండి!" అని చెప్పింది. రాజభటులు మీగడహల్వా తిన్న



యువకుడి కోసం రావటం చూసి ప్రజలు, "అయింది, వీడికి కూడా మూడింది!" అనుకున్నారు. అయితే వారు అను కున్నట్టుగా రాజభటులు అతని పైన పడి జరజరా ఈడ్చుకుపోవటానికి మారుగా, "మా రాజుగారు తమతో ఒక్కసారి మాట్లాడగోరుతున్నారు, వస్తారా?" అని మర్యాదగా అడిగారు.

"వారి ఆజ్ఞ!" అంటూ అలీషార్ లేచి వారి వెంట బయలుదేరాడు.

ఇది చూసి పౌరులు తలా ఒక విధంగా అనుకున్నారు. కొందరు, "వీడికి నూకలు చెల్లాయి," అన్నారు. మరికొందరు, "అలా



జరగక పోవచ్చు. వీడు ఆ హల్వా కడుపు నిండా తినేశాడు," అన్నారు. మరికొందరు, "వీణ్ణి రాజభటులు జరజరా ఈడ్చుకు పోవటం లేదు. వీడి కే ప్రమాదమూ రాదు—చూస్తూ ఉండండి!" అన్నారు.

అలీషార్ తన సమీపానికి వచ్చి నిలబడగానే జముర్రుద్, మిగిలిన వాళ్ళను అడిగినట్టుగానే, "యువకుడా, నీ పేరేమిటి? నీ వృత్తి ఏమిటి? ఈ నగరానికి ఎందుకు వచ్చావు?" అని అడిగింది.

"నా పేరు అలీషార్. నా తండ్రి ఖురాసాన్ దేశంలో వర్తకుడుగా ఉండేవాడు. నేనూ అదే వృత్తిలో ఉంటూ రోజులు కలిసిరాక ఆ వృత్తి మానేశాను. నాకు అత్యంత ప్రియురాలైన స్త్రీని పోగొట్టుకుని ఆమె కోసం వెతుకుతూ ఈ నగరానికి వచ్చాను. ఆమె కన్న నాకు వేరే ప్రపంచం లేకపోవటం చేత, ఆమె పోయిన క్షణం నుంచీ నాకు సమస్తమూ కలలాగా ఉంటున్నది," అంటూ అలీషార్ పట్టలేని దుఃఖంతో మూర్ఛపోయాడు.

అతని ముఖాన పన్నీరు చల్లమని భటులకు చెప్పి జముర్రుద్ ఎప్పటిలాగే ఇసుకలో రాగి పుల్లతో గీతలు గీసి, వాటిని పరీక్షించినట్టు అభినయించి, అందరికీ వినపడేలాగ అలీషార్‌తో, "నీవు చెప్పిన దానిలో అబద్ధమేమీ లేదు. నీ ప్రియురాలు నీకు తప్పక దొరుకుతుందని కూడా నేను జోస్యం చెప్పగలను," అన్నది.

విందు పూర్తి కాగానే జముర్రుద్ తన భటులతో, "ఇతన్ని స్నానశాలకు తీసుకుపోయి స్నానం చేయించి, దివాణం నుంచి కొత్త బట్టలు తీసి అతనికి తొడిగి, ఒక గుర్రాన్ని అతని కిచ్చి, బాగా చీకటి పడ్డ తరవాత అంతఃపురానికి తీసుకురండి," అని ఆజ్ఞాపించింది.

ఆమె రాజభవనానికి వెళ్ళి, ఎప్పుడు చీకటి పడుతుందా, ఎప్పుడు తన భర్త

వస్తాడా అని ఎదురు తెన్నులు కాస్తూ, క్షణ మొక యుగంగా భావిస్తూ, ముళ్ళమీద ఉన్నట్టు ఉండిపోయింది. సాయంకాల ప్రార్థనల సమయం దాటి పోగానే ఆమె తన రహస్య మందిరానికి వెళ్ళి, అక్కడికి అలీషార్‌ను ప్రవేశ పెట్టమని ఉత్తరు విచ్చింది. అతను తనను ఒక్కసారిగా గుర్తిస్తే ఆనందం పట్టలేక ప్రాణాలు వదులుతాడని భయపడి తన పైన వెలుగు పడకుండా క్రీనీడలో కూచున్నది.

ఎక్కడి నుంచో వచ్చిన ఈ యువకుడిపై తమ రాజు ఇంత శ్రద్ధ కనబరచటం చూసి రాజోద్యోగులు, "రేపీపాటికి ఈ యువకుడు ఏ మంత్రో, సేనానాయకుడో అయిపోతాడు," అని తమలోతాము చెప్పుకున్నారు.

అలీషార్ వచ్చి అభివందనం చేశాడు. జముర్రుద్ అతన్ని, "స్నానశాలకు వెళ్ళావా? సేద తీరిందా? స్నానం అనంతరం ఆకలి కలగలేదా?" అని ఏవో ప్రశ్నలతో పలక రించింది. అన్ని ప్రశ్నలకూ అలీషార్ "చిత్తం," అని జవాబిచ్చాడు.

తరవాత ఆమె అతని చేత భోజనం చేయించింది. భోజనానంతరం అతన్ని తన సమీపంగా వచ్చి కూచోమన్నది. అతను ఆశ్చర్య పోయాడు, కాని ఆమె ఆజ్ఞ ప్రకారం ఆమె శయ్యకు సమీపంగా వెళ్ళి



కూచున్నాడు. ఆమె అతని చెయ్యి అందుకుని ఇంకా దగ్గిరికి లాగింది. అలీషార్ ముఖాన కనబడిన ఆశ్చర్యం చూసి ఆమెకు నవ్వాగలేదు. ఆమె విరగబడి నవ్వుతూ, "ఇంకా నీ బానిసను గుర్తించలేదా, అలీషార్?" అని అడిగింది.

ఆ మాట అన్నదాకా అతను జముర్రుద్ ముఖం కేసి పరీక్షగా చూడలేదు. ఆమెను గుర్తించినాక అతనికి గలిగిన ఆనందం వర్ణనాతీతం. ఇంత కాలానికి అతని అన్వేషణ ఫలించింది.

మర్నాడు తెల్లవారుతూనే జముర్రుద్ రాజరికపు దుస్తులన్నీ ధరించి, తన కింది ఉద్యోగు లందరినీ రాజప్రాంగణంలో హాజరు కమ్మని కబురు పంపింది. అందరూ వచ్చాక ఆమె వారితో, "ఇవాళ నుంచీ నేను నా రాజరికాన్ని వదులుకుంటున్నాను. అందుచేత మీరు మళ్ళీ నగర ద్వారం వద్దకు వెళ్ళి మరొక రాజును సంపాదించుకోండి. ఇక నుంచీ నా జీవితం ఈ యువకుడి జీవితంతో ముడి పడి ఉంది. నేను ఇతని దేశానికి వెళ్ళి పోతున్నాను. మిమ్మల్ని అల్లా కాపాడతాడుగాక!" అన్నది.

నగర పౌరులు తమ రాజుగారికి అద్భుతమైన వీడ్కోలు ఇచ్చారు. రాజుగారి పెట్టెల నిండా అంతులేని బట్టలూ, నగలూ, డబ్బూ నించారు. ఆహారం సిద్ధం చేశారు. పెట్టెలన్నిటినీ ఒంటెలపై కెక్కించారు. రెండు మూపురాల ఒంటె మీద మఖ్మల్ పరిచిన పల్లకిలో జముర్రుద్‌నూ, అలీషార్‌నూ ఎక్కించారు.

ఇవన్నీ వెంట బెట్టుకుని అలీషార్ తన నగరానికి వచ్చాడు. అతను బీద సాదలకు దాన ధర్మాలు చేశాడు. తమ వద్ద పుష్కలంగా ఉన్న డబ్బుతో అలీషార్ జముర్రుద్‌లు చాలాకాలం సుఖంగా కాపరం చేసి అనేక మంది పిల్లలను కన్నారు.

—(సమాప్తం)

